అక్టోబరు

1944

సంవత్సర చందా

రు 3-0-0

బెజవాడ


# విషయ సూచిక

ఆమెను క్షమించుటయేనూ లేకపోలేదు. వ్యభిచారం చేయని స్త్రీకంటె వ్యభిచారంచేసే స్త్రీ తన భర్త సౌఖ్యాన్ని మరింత ఎక్కువగా కలిపెట్టియుండటమూ కద్దు. ఈ సౌఖ్యాలకు మరగిన అతను భార్యను వదలిపెట్టనూ కూడా లేడు. అందుకనే ఆమె అంతే ఎక్కువ వినయాన్ని చూపిస్తుంది కూడానూ. ఇందువల్లనే ఒకసారి లేచిపోయిన భార్యతో సంసారాన్ని సాగించుకునే పురుషులున్నారు.

ఇంతేగాకుండా ఒక స్త్రీ వ్యభిచారం చేసినంత మాత్రాన ఆమె చేసుకున్న భర్తమీద ప్రేమను సాంతంగా చంపుకుందని అర్థంగాదు. వ్యభిచారం చేసే పురుషుడుకూడ తాను చేసుకున్న భార్యమీద ఉండే ప్రేమను చంపుకోలేడు. ఇన్ని సంగతులు యిట్లా ఉండినాకూడ ఒకసారి దంపతులుగా ఏర్పడిన స్త్రీపురుషులు అన్యోన్యం ప్రేమను పెంచుకుని అన్యథా చరించక పోవుటలోనే దాంపత్యముయొక్క సౌఖ్యం శాశ్వతంగా నిలచి ఉంటుందని చెప్పేమాట మిక్కిలి సత్యమైనది. ఏమంటే ఒకసారి వ్యభిచరింప మొదలిడిన స్త్రీగాని, పురుషుడుగానీ, ఆ ఒక్కనితోనే ఆగిపోతుంది అనే మాట నమ్మకం లేదు. వ్యభిచరించకూడదు అనే శీలముయొక్క బంధము సడలిపోతుంది. దానితో భార్యాభర్తలకు అన్యోన్యం దూరమైపోతుంది. అందువలనే ప్రపంచకములో ఉండే సౌందర్యమైన స్త్రీలను చూచినప్పుడు ఆ సౌందర్యమంతా తన భార్యయందు భావనచేసి నిలుపుకొనవలెను. ఈవిధంగా భావన చేయగలిగిన దంపతులకు సౌఖ్యానికి ఏమి కొదవ ఉంటుంది.

4. అసమరతికూడా సంసారవిచ్ఛేదానికి కారణంగా ఉంటుంది.అనే విషయం సుఖసంసారంలో విపులంగానే వ్రాసియున్నందున నిచట విస్తరించలేము.

5. అసూయా దాంపత్యవిచ్ఛేదం చేయటానికి మిక్కిలి సమర్థమైయున్నది. దీనినిగురించి ఎంతచెప్పినా చెప్పవచ్చును. తాను పొందవలసిన పరిణయసౌఖ్యాన్ని, వ్యభిచారియైన తన భర్తవల్ల వేరొక స్త్రీ అనుభవిస్తోంది అను అసూయ స్త్రీలో ప్రవేశించినప్పుడు ఆమె తన కసినంతా పెనిమిటిమీద చూపిస్తుంది. విసుగు చూపించకుండా ఉంటే ఆమెకు ఎంతో మేలుజరుగుతుంది. ఇంట్లో భర్తమీద విసుగు చూపిస్తూ ఆర్భాటం చూపించే భార్యమీద ఉండే ప్రేమ అతనికి క్రమక్రమంగా తగ్గిపోతుంది. ఆ సంసారం కూడా విచ్ఛేదానికి గురి అవుతుంది. అందువల్లనే తెలివిగల స్త్రీ తన దుఃఖాన్ని తనలోనే దిగమ్రింగి తాను భర్తను రంజించి స్వాధీన పరచుకునేందుకు ప్రయత్నం చేస్తుంది. తన భర్త తనను వదలిపెట్టి అతని తోబుట్టువుతోనో, తల్లితోనో, హృదయమిచ్చి మాట్లాడుతుంటే కూడా కొందరు స్త్రీలు ఓర్చుకోలేరు. అందువలననే తనభర్త తోబుట్టిన వారితోనూ, తల్లితోనూ ఆయిల్లాలు తగువులాడుట సంభవిస్తోంది. అతడి తల్లీ, తోడబుట్టూ అనుకుంటారుగదా! ఆమెను మనమేమీ అనకపోతేను మనమీద యిలా కొరకొరలాడుతుంది యేమిటిరా! అని ఇంతేగాదు భర్త బాగుగా ప్రేమించే వస్తువును చూచినా కూడా ఆమె అసూయను పెంచుకుంటుంది. అందువల్లనే పెనిమిటి లేనప్పుడు కాంపోజిషన్ పుస్తకాలను, ఆ పుస్తకాలను అతను తాను యోచించే వ్యవసాయపు పనిముట్లను యిలాగే యింకా యితర వస్తువులనూ ఆమె ఘాతాలవలె చూస్తుంది. “తొమ్మిది గంటలయినా క్లబ్ నుంచి యింటికి రారండీ!” అనే యిల్లాండ్రను మనం తరచు చూస్తూనే ఉంటాము. ఈ అసూయలోనే సంసార విచ్ఛేదక బీజాలు ఉన్నవి లాగుంది. నోరుమూసుకు భరిస్తే సరే ఉన్నది గాని ఆమె చికాకుపెట్ట నారంభించిన మొదలు తనకు ప్రియమైన వస్తువుమందు అతనికి ప్రేమ మరింత ఎక్కువవుతుంది. అందుచేతనే అసూయ ప్రణయవృక్షమునకు వేరుపురుగని సుఖసంసారమందు వ్రాసియుంటిని.

6. భయంలోకూడ సంసారవిచ్ఛేదక బీజాలున్నవి. తనభర్త వేరొక స్త్రీతో రమించుచున్నందున ఎప్పటికైనా తనను వదలిపెట్టకమానడు అనేది ఒక భయం. కవిత్వం చెప్పుతూ చెప్పుతూ ఏ రాజులతో స్నేహం చేసి వారితోనే పడిపోయి తనయొక్క క్షేమం చూడడేమోననేది యింకో భయం. తన బిడ్డనే అతనుకూడా ప్రేమిస్తుంటే కూడా, ఆ ప్రేమ ప్రవాహంలో అతడు కొట్టుకుపోయి తన ప్రేమను మఱచిపోతాడేమో అనేది యింకో భయం. యిలా చెప్పుకుపోగా పర్యవసానంగా తేలేదేమంటే, ఒకరికి రెండవవారి మీద ఎంత ప్రేమ యెక్కువగా యుంటే, వారు తనకు కాకుండా పోతారేమో, లేకుండా పోతారేమో, అనే భయం కూడా అంత ఎక్కువగా యుంటుంది. అందువల్లనే

వద్దుకేని ప్రేమవలన గూడా, భయం కలుగుతుంది. ఆ భయం సంసారవిచ్ఛేదానికి హేతువగుతుంది.

7. తనభర్త తనమీద విసుగుకుంటాడు. తనభర్త తాను చేసిన ప్రతిపనికీ వంకలెట్టి చికాకు పడుతూ ఉంటాడు. తనమాట ఒక్కటీ సాగనీయడు. ఇంట్లో నౌకర్లమీద చూపించే గౌరవం గూడా తనమీద చూపించడు. ఈ విషయాలు ఆమె మనస్సుకు తోచినంతనే సిద్ధాంతంగా యున్న స్వాతంత్ర్యేచ్ఛ ఆమెలో మేలుకొంటుంది. ఆమె స్వాతంత్ర్యాన్ని వాంఛించినకొద్దీ, అది ఆమెకు దూరమైపోతూ యుంటుంది. ఇంగితంగల భర్తకనక అయితే ఆమె దేనికి కష్టపడుతోందో, గుర్తించుటకు ప్రయత్నిస్తాడు. సామాన్యమనిషే అయితే ఆ సంసారం విచ్ఛేదం కావలసిందే, కాక. ఆమె వాంఛకు లోబడి ఆ పురుషుడు లోబడిపోయినా గూడా ఆమెకు గడ్డిపోచ మీద ఉండే గౌరవంగూడా అతనిమీద యుండదు. ఆమె అతనిమీద స్వారీచేయుటం మొదలు పెడుతుంది. అతనింకా భరించ లేకపోతాడు. చేత చిక్కిన అధికారాన్ని ఆమె వదలుకోదు. అతడు తన గర్వానికి తగిలిన అఘాతాన్ని భరించలేడు. అప్పుడైనా ఆ సంసారం విచ్ఛేదం కాకమానదు. అందువల్లనే ఆమెలో స్వాతంత్ర్యేచ్ఛ స్వేచ్ఛాప్రియత్వం మేలుకొకముందే పురుషుడామెను తన అధికారంలోనే ఉంచుకుని ఆమెకు కావలసిన సౌఖ్యాన్ని చేకూరుస్తూ ఉంటాడు. అందువల్లనే స్వేచ్ఛాప్రియత్వంలో కూడా సంసారవిచ్ఛేదక బీజాలు ఉన్నవి.

8. చిన్నతనంలోనే ముష్టిమైథునాది దురభ్యాసాలవల్లగాని రహస్య సంప్రయోగాదులవల్లగానీ ఆదివరకే శక్తిని కోల్పోయినవారు అనుమాన రోగంతో బాధపడతారు. తానిదివరకే శక్తిహీనుడగుటవలన తన భార్యను రంజింపలేననుకొని సంశయింపనారంభించిన వానికి పురుషావయవమునందు పటుత్వము తగ్గి శీఘ్రస్ఖలనాదులు కలుగవచ్చును. అంతేగాకుండా తనవల్ల భార్య సంపూర్ణసౌఖ్యం పొందుతున్నా గూడ అతని మనస్సులో ఉండే అనుమానం అతన్ని పీడిస్తూనే యుంటుంది. అందువల్ల అతడు భార్యతో సరిగా ప్రవర్తింపజాలడు. అందువల్ల అతనికి దౌర్బల్యం మొదలయినవి కలుగుతవి. భార్యమీద అనుమానం పెంచుకున్న మగవాడు సంప్రయోగమునందు వైముఖ్యాన్నే పెంచుకుంటాడు. ఆ వైముఖ్యంగూడ క్రమముగా సంసారవిచ్ఛేదానికే కారణమవుతుంది. వివాహానికి పూర్వం బాలురతోటి సంపర్కం గలిగిన బాలికలు గూడా వివాహబంధంలో స్థైర్యంగా ప్రవర్తించలేరు. తనయొక్క అవినీతి ఏ కారణంచేతనైనా భర్తకు తోచి పోతుందేమోననిగూడ భయం. క్షతయోనిగా నున్న తనను ప్రథమ సంప్రయోగములోనే పసిగట్టగలడేమో అనే భయంగూడా ఉండవచ్చు. తనతో సుఖించిన బాలురవలెనే తన భర్తగూడ యితరులతో వ్యభిచరించగూడదా! అనే అనుమానం. ఈ అనుమానాలచేతగూడా క్రమక్రమంగా సంసారమందు విచ్ఛేదము కలుగుతుంది. కనుకనే వివాహమునకు పూర్వమందే వ్యభిచరింప నారంభించినవారును, వ్యభిచారానికి వశతులు కదురక ముష్టిమైథునాది అక్రమమును అసహజమును నగులోలతకు లోబడినవారును, సుఖసంసారమును దుఃఖసంసారముగా చేసుకొనుట కద్దు. చిన్నతనములో వ్యభిచరింప నారంభించిన పురుషుడు తన భార్యను మిక్కిలి అనుమానించి బాధించుటయు కద్దు, తనకు వ్యభిచారమునందు తోడుపడిన స్త్రీలవలెనే, తన భార్యయును యింకొకరితో వ్యభిచరించి యుండ గూడదా అని అతని అనుమానము. అంతేగాకుండా భర్తలను మోసగించి తనతో వ్యభిచరించిన స్త్రీలవలెనే తనభార్యయును తనకు అడకువగనే వర్తించుచు వేరొకనితో వ్యభిచరించుచుండగూడదా అని అతని అనుమానము. ఆమె యొక్క వినయము చూపిస్తే ఆమె అంత తనను మోసగించుచున్నదని అతని యనుమానము. ఈయనుమానముతో నతడామెను బాధింప నారంభించిన యెడల వారి సంసారసుఖమునందు తుపాను అరంభమై సంసార విచ్ఛేదమునకే తోవతీయును.

9. చాలామందికి ఎంతో వయసు వచ్చేదాకా వివాహము కాదు. వివాహమువలన బలము తగ్గుతుందనీ ఆయువు తగ్గుతుందనీ, చదువుసాగదనీ, కుటుంబము భరింపలేకా, విచ్ఛృంఖలంగా బాధ్యత లేకుండా తిరగటానికి వీలుండదనీ అనేకమంది బుద్ధిపూర్వకంగానే వయస్సువచ్చినా వివాహమాడరు. వారికి కామేచ్ఛ ఉండనేఉంటుంది, కాని దానిని వారుఅణచి పెట్టుకుంటారు. కొంతమందికి డబ్బులేకా, ఉద్యోగం లేకా, కులగౌరవాలులేకా, సౌందర్యములేకా, అమితమైన ఆశచేత మేనసంబంధమూ నచ్చకా గూడా చిరకాలము వివాహము కాదు. ఇట్టివారు తమ కామాన్ని అణచిపెట్టుకుంటారు. దానితో వారి నరాలలో ఒకవిధమైనవ్యాధి ఆరంభిస్తుంది. శుక్లనష్టము, శ్వేతకుసుమము

మొదలైన వ్యాధులుకూడా ఆరంభిస్తవి. ఈ వ్యాధులు ఏమిచేసినను నయముకావు. ఒకవేళ అవి నయమైనప్పటికీ, వానికి వాడినమందులు, అసలు రోగాలకంటే కూడా యెక్కువ అపకారము చేస్తవి. వాటివల్ల రోగము వచ్చిందనే భయం పీడిస్తుంది. దేహములో ఊరిన కామ ద్రవాలు దేహాన్ని పీకిస్తూఉంటవి. ఒకదానికొకటి తోడుపడి కామశక్తులను తగ్గించివేస్తవి. సక్రమ ప్రవర్తన వల్ల వాంఛకలుగకపోతే సరే ఉందిగాని కామోద్రేకము కలుగుతూఉండి, దానిని అణచిపెట్టుకొనుట వలన కూడా ప్రాణశక్తులు నశిస్తవి. ఈ కారణముచేత గూడ దాంపత్యములో కేవలముగా వైముఖ్యమున్నూ, వైమనస్యమున్నూ కలిగి క్రమంగా సంసారవిచ్ఛేదానికే దారి తీస్తుంది. అందువలననే యుక్తవయస్సులో సంసార బంధమును స్వీకరింపవలెను. మితిమీరిన కాలము కామశక్తులను అణచియుంచుకున్న వారు, దానినే బ్రహ్మచర్యమని గాని ఇంద్రియనిగ్రహమని గాని భ్రాంతిపడరాదు. దానివలన బ్రహ్మచర్యముచేత వలెనే ఆయువు వృద్ధిపొందునని గాని, బలారోగ్యములు వృద్ధిబొందునని గాని యెవరును భ్రమపడరాదు.

(సశేషము)

# కనీనికానిదానము

## అధ్యాయము 8.

మృత్తింటి

### గజ్జిమచ్చలు

సముద్రతీరములలో నివసించువారు మత్స్యములను యెక్కువగా తింటారు. వీరు చర్మరోగములతో యెక్కువగా బాధపడతారు. మధ్యధరా సముద్రతీరములలో నివసించువారును గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి మొదలగు చర్మవ్యాధులతో యెక్కువగా బాధపడుతూఉంటారు. వారి చర్మరోగములకు రస, విష, పాషాణములతో తయారు కాబడిన మందులను పూసెదరు. బయటకు కనపడకుండా యీ మలినములన్నీ రక్తముతో కలిసి తిరుగుచునే ఉంటవి. వారి కనీనికలలో నల్లటి గోధుమవన్నె మచ్చలు యెక్కువగా కనబడును. ఈ మచ్చలు సూదిమొన మొదలుకొని కుంకుడుగింజంత పరిమాణమువరకును ఉండును. కనీనికానిదాన శాస్త్రములో యీ మచ్చలు గజ్జిమచ్చలని వ్యవహరింపబడును. ఈ శబ్దమునకు ఈ అర్థమునే చెప్పవలయును.

చర్మరోగముల మందులతో అణచిపెట్టుటవలన కనీనిక చుట్టూ నుండు తెలుపటి ఆవరణ నల్లబడును. మందముగా నుండును. ఈ సంగతిని మా ఆసుపత్రికి వచ్చిన కేసులలో ప్రత్యక్షముగా చూచినాము.

హోమియోపతీ వైద్యశాస్త్ర పితామహుడగు హానిమన్ వంశానుగతముగా వచ్చు చర్మరోగముల నన్నిటికిని 'సోరా' యని నామకరణము చేసినాడు. కనీనికానిదానము యీ సోరాను గూర్చి యేమైనా చెప్పనేమో తెలుసుకొందాము. ఈ 'సోరా'ను గూర్చి మందువైద్యములో వాదోపవాదములు గలవు.

సమానలక్షణములుగల మందుల వాడిన యెడల రోగములు కుదురునటయే హోమియోపతీ వైద్యశాస్త్రమునకు మూలము. ఈ సిద్ధాంతమును వినగానే అలోపతీ వైద్యులందరును అపహాస్యము చేసిరి. ఈ సిద్ధాంతమును పూర్తిగా నమ్మలేక హానిమన్-అనుయాయులే ఉపేక్ష వహించిరి. ఈసిద్ధాంతము పుట్టిన తరువాత అనేక విపరీత సిద్ధాంతములు పుట్టి రూపుమాసిపోయినాయి. ఇట్లా పుట్టి రూపుమాసిపోయినవాటిలో టీకాల సిద్ధాంతము మొదటిది. ఈ టీకాలవలన చాలా చాలా లాభాలు ఉన్నాయని మొదటిలో ప్రచారము చేసినారు. టీకాలవలన ఉపకారముకన్న అపకారము యెక్కువగుచున్నదని కాలమే నిర్ధారణ చేసినది. సర్పి సిద్ధాంతము రెండవది. గొంతులో మంట కనబడగనే ముందెప్పుడో సర్పి కలుగుతుందని రోగము రాకుండా ఉండగలందులకు మందుల వాడుచున్నారు. ఈమందులు చాలా ఉపయోగము చేస్తవని చాలా కాలమువరకు ప్రచారము చేసినారు. కొన్ని సంవత్సరములు గడచినవో లేవో సర్పిరాకుండా వాడినమందుల వలననే సర్పివచ్చుచున్నదని కాలమే నిర్ధారణ చేసినది. అప్పటినుండీ సర్పిమందుల వాడవద్దన్నారు అలోపతీ వైద్యులు

పటి ఆవరణరంగును చూడవలయును. మిగిలిన ఆరు ఆవరణల రంగుమాదిరిగనే యీ ఆవరణరంగూ ఉండును. ఏమియు తేడా ఉండదు.

అట్లుగాక, చర్మవ్యాధులను రస, విష, పాషాణాదులతో తయారుచేసిన మందులను రాసి పూసివేసిన యెడల కనీనికయొక్క తెలుపటి ఆవరణరంగు మరింత నల్లపడును. అప్పటివరకు లేతగా ఉన్నరంగు ముదురు రంగుగా మారిపోవును.

దీనినిబట్టి యేమి తెలుసుకొన్నామంటే – చర్మరోగములకు తామరమందులు రాసి అణచివేయక రోగపదార్థము బయటకు వెడలుటకు ప్రకృతివైద్య చికిత్సా పద్ధతులద్వారా ప్రకృతికి సాయముచేసినయెడల రోగపదార్థము త్వరగా పోవును. చర్మరోగములు కనపడకుండా పోవును. దేహము శుభ్రపడును. దీనికిగుర్తు ఎట్లాగంటే కనీనికయొక్క తెలుపటి ఆవరణరంగు పల్చబడును. మిగిలిన ఆవరణలలోని రంగుతో కలిసి పోవును.

దేహములోని మురుగునుండియే పుట్టక బయటనుండి వచ్చు సూక్ష్మజీవులవలననే చర్మవ్యాధులు వచ్చిన యెడల కనీనికలోని 7 వ ఆవరణరంగు పలచనై మిగిలిన ఆవరణలలోని రంగుతో కలిసిపోవుటకు వీలులేదుగదా! దేహము శుభ్రపడుటకును వీలులేదు.

మరొకవిషయముకూడా గలదు. చర్మవ్యాధులద్వారా రోగపదార్థమును బయటకు రానివ్వక లోపలనే అణచివేసినయెడల రోగపదార్థము బయటకు పోవుటకు వీలులేక బలహీనముగానున్న అవయవములలో చేరును. కనీనికలోని ప్రతినిధి భాగములో మచ్చలేర్పడును. కనీనికా ప్రతినిధి భాగములోని మచ్చనుబట్టి యీ రోగ పదార్థము యే అవయవములో చేరినదీ చెప్పగలము. కనీనికలోని యేడవఆవరణలో కనుపడు గోధుమరంగు మచ్చలకును చర్మవ్యాధులకును సంబంధ మేమిటని మమ్ములను చాలామంది ప్రశ్నిస్తారు. దీనికి మేము చెప్పుసమాధానమేమంటే ప్రకృతివైద్యము చేసినప్పుడు స్వాస్థ్యసంకటములు జరుగును. ఒళ్ళంతా గజ్జి పగలవేయును. చికిత్సప్రారంభించుటకు పూర్వము ఉన్న 7 వ ఆవరణలోని గోధుమరంగు మచ్చలు గజ్జినయమైన వెంటనే పోవును.

ఈ విషయము మా అనుపత్రిలో ప్రత్యక్షముగా ప్రతిరోజును మేము చూచువిషయమేగాని యిందులో యేమియు అతిశయోక్తిలేదు. నిదర్శనపూర్వకముగా చెప్పుటకు మా ఆసుపత్రికివచ్చి నయము చేయించుకొని వెడలిన ఒకామె చరిత్రను చెప్పుట అప్రస్తుతము కాదనుకుంటాను.

ఒకపిల్లకు ఒంటినిండా గజ్జిలేచినది. గంధకము కలిపిన మందులతో ఆ గజ్జిని ఆపివేశారు. ఇట్లు ఆపి ఒక సంవత్సరము గడచినదో లేదో కనీనికచుట్టూనుండు మొదటి ఆవరణలో (మొదటిఆవరణ జీర్ణాశయమును తెలుపును) ముదురుగోధుమరంగు మచ్చలు కనుబడును. అప్పటి నుండి ఆపిల్ల జీర్ణాశయ రోగముతో బాధపడినది. తరువాత జీర్ణాశయములో వ్రణ్ణు పుట్టినవి.

తలనిండా కురుపులులేచినవి. రోజూ, రోజూ యీ కురుపులు పెరిగిపోయినవి. అసహ్యమైన చీముపోయేటందుకు చాలా మందులు రాసినారు. రసము, పాషాణములతో తయారుచేసిన మందులు వాడినారు. చితచితలాడే కురుపులన్నీ మూడుపూటలలో మాయమైపోయినాయి. బయటకు మాత్రము కనపడకుండా పోయినాయిగాని సాంతరమేమీ వదలలేదు. తలనుండి బయటకు వచ్చే పెక్కు తోవలను మూసివేసినారు. ఈ పెక్కుతోవలా బయటకు వచ్చు రోగపదార్థమంతా ఒక ముఖముగా బలహీనమైన అవయవములో చేరుకుంటూంది. ఆ అవయవమును విపరీతముగా బాధపెట్టుతుంది. కాలికముగా నుండు తలనొప్పి, మూర్ఛలు ఉబ్బసము, నాడీవ్యాధులు, సంగమక్రియయందు అయిష్టము, మొదలగు నవన్నీ యిట్లా వచ్చినవేను.

కొన్ని సంవత్సరముల క్రితము మా ఆసుపత్రికి పరీక్షార్థమై ఒకామెవచ్చింది. ఎడమకనీనికను చూడగనే పెద్దమెదడును తెలుపు ప్రతినిధి. భాగములో లేతగోధుమరంగుమచ్చ కనుపడినది. ఆమెకును నాకును యీ క్రింది సంభాషణ జరిగినది.

నేను–నీవు చాలారోజులనుండీ తలనొప్పితో బాధపడుచున్నావు. నాడులలో చిమ చిమ యున్నవి. తల దిమ్ముగా ఉంటుంది. కాళ్లూ, చేతులు పైకి పీకికొని పోవుచుండును.

ఆమె–మీరు చెప్పినవన్నీ నిజమేను ఈ బాధలకు కారణ మేమిటి ?

నేను–చిన్నప్పుడు అనగా బడికిపోయే రోజులలో గజ్జి లేచినది. మామూలుగా రాచేమందులన్నీ మా అమ్మ రాచింది. ఆ గజ్జి రూపుమాసిపోయింది.

ఆమె-ఒక తడవ కాదు చాలా తడవలు అట్లా గజ్జిలేచింది. గజ్జి లేచినప్పుడల్లా మందురాచింది. అణగిపోయినాయి గజ్జిలేచుటకును, మందులు రాయుటకును యీ బాధలకును సంబంధ మేమిటి?

నేను-దేహములో అనుక్షణమూ తయారై బయటకు పోక లోపలనే నిలిచిపోయిన మురుగువలననే యీ రోగాలన్నీ వచ్చినాయి. తలమీద లేచిన కురుపు అను మందులతో అణచిపెట్టకపోతే యీ రోగాలేమీ వచ్చేవి కావు. బయటకువచ్చు ద్వారమును మూసినారు గనుక బయటకువచ్చు త్రోవలులేక యీ రోగపదార్థము బలహీనమైన అవయవములలో చేరి దానిని బాధపెట్టినది. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించి ప్రకృతి వైద్యము చేసినయెడల ఆ కురుపులన్నీ మళ్లీ ప్రత్యక్షమగును, (ప్రకృతిచికిత్స మొదలుపెట్టినది. మూడు నెలలు గడచినది.)

ఆమె-డాక్టరుగారూ తలనిండా కురుపులు లేచుచున్నాయి. చాలా బాధగా నున్నది.

నేను-(ఆమె కనీనికను చూచితిని. వెనుక చూచిన మచ్చమీద తెల్లగీతలు ఉన్నాయి) మీ పాతస్నేహితు (ప్రియులు) అందరూ వస్తారు.

ఆమె-పాతస్నేహితులంటే మీ అభిప్రాయమేమిటి.

నేను-పాతికసంవత్సరాల క్రితము మీ తల్లి సాగనంపిన పాతస్నేహితులు మళ్లీ వచ్చిపోతాయి.

ఆమె-(వారము రోజుల తరువాత) ఆశ్చర్యముతో, డాక్టరుగారూ ఒకళ్లా యిద్దరూ కారు. కొన్నికోట్ల మంది స్నేహితులు వచ్చారు.

నేను-రావటము మంచిదేగా వచ్చారుకాబట్టి రోగము తప్పకుండా నయమగుతుంది. చన్నీళ్లు, దువ్వెనతోనే వానిని మర్యాదచేయి. మందులను మాత్రము రాయబోకు.

ఆమె-డాక్టరుగారూ! మీకు బాగా తెలుసునండీ పాత స్నేహితులు వస్తారని ముందుగానే చెప్పారు. ముందుగా చెప్పారు కాబట్టి నిలబడి చికిత్సచేశాను గాని లేకపోతే మందులకోసము పరుగెత్తేదానను.

పాతస్నేహితులు రెండు వారాలపాటు ఉండిపోయినారు. అప్పటినుండీ తలనొప్పి, నరములలోని చిమ, చిమలు అన్నీ తగ్గిపోయినాయి. ఇప్పుడే కనుక (యీ పాతస్నేహితుల) బయటకు పంపకపోతే ఆమెకు కొద్ది రోజులలోనే పిచ్చి పుట్టేది.

ఈ సూక్ష్మజీవులు బయటనుండి వచ్చినాయనుకొనుటకు వీలులేదు. అంటురోగాలతో రాలేదు. ఎందుకంటే ఆమె శుభ్రమైన గాలీ వెల్తురులు ధారాళముగా వచ్చు ప్రదేశములోనే కాపురమున్నది. ఈమె చేసిన చికిత్స యేమిటంటే- మూడునెలలపాటు రోజూ తలకు చన్నీళ్ళు రాచి దువ్వేది. ఇంతకన్న మరేమీ చేసేది కాదు.

"ఈ పేలు దేహమునుండి వచ్చినాయని మీరు నమ్మరు గదా? మరి యెక్కడనుండి పుట్టినా యంటారు?" అని మా స్నేహితులు అడుగుతూ ఉంటారు నిజం చెప్పాలంటే యీ పురుగులు యెక్కడనుండి వచ్చేది నాకు తెలియదు వంశానుగతముగా వచ్చు రోగప్రవణతలను ప్రకృతి బయటకు పంపివేయునపుడు మాత్రము యిటువంటి స్వాస్థ్యసంకటములు కలుగుచుండుట మా అనుభవములో ప్రత్యక్షముగా చూచుచున్నాము. కుళ్లిన మాంసములో పురుగులు యెట్లు కలుగునో అట్లనే రోగప్రవణతలోనే సూక్ష్మజీవులు కలుగును.

(ఈ సంగతి నేనునూ పదేళ్లక్రితము 'ప్రకృతి' పత్రికకు వ్రాశాను. ఆ వ్యాసములోని భాగమునే యేమీ మార్పులేకుండానే యిప్పుడు యెత్తి వ్రాస్తున్నాను. రోగపదార్థములోనే సూక్ష్మజీవులు పుట్టునని ప్రొఫెసరు బిఛాంపు 19వ శతాబ్దములోనే వ్రాసిన 'మైక్రోజమీ' సిద్ధాంతమును నేను చదువువరకు రోగపదార్థములోనే రోగజీవులు కలుగును సంగతిమాత్రము నాకు తెలియదు. ఎక్కడపడితే అక్కడే ఈ సూక్ష్మజీవులు పుట్టునని నేను వాదిస్తూ వచ్చాను. వివరములు గోరువారు 'లిండ్లారు' గారి "నేచర్ క్యూర్" చదువగలరు.

మా మిత్రులకు మరొక సందేహముకూడా తోచవచ్చు. ఈ సూక్ష్మజీవులు బయటకువచ్చునపుడు ఇన్ని బాధలు కలుగుచున్నవి గదా. ఇన్ని బాధలు కలుగచేయు సూక్ష్మజీవులను యెందుకు రెచ్చగొట్టాలి. ఏ మూల ఉన్న వాటిని ఆ మూలనే ఉంచనీయరాదా అంటారు. చిన్నతనములోనే వీటిని బయటకు పంపకపోతే కాల ముగడచిన కొలదినీ ఈ రోగపదార్థమే బయటకుపోదు. యెక్కువగా నున్నప్పుడే వంచలేకపోతే మ్రాను అయిన తరువాత అసలే వంచలేము. యావజ్జీవితము అంతర్వ్రణము, క్షయతో బాధపడుటకన్న ఒకటి రెండు వారాలతో తేలిపోయే స్వాస్థ్యసంకటములు నయముగదా.

'సోరా'లోనే అంతర్వ్రణములు పుట్టుచున్నవి.

వంశానుగతముగా వచ్చు రోగప్రవణతలనన్నిటినీ హాన్‌మన్ 'సోరా' యని వాడినాడు. ఈ శబ్దమును ఈ అర్థములోనే మేమున్నూ వాడుతాము. కనీనికలో కనుపడు సోరా మచ్చలవలననే అంతర్వ్రణముల పుట్టు పూర్వోత్తరముల తెలుసుకొన గల్గుచున్నాము. క్షయ రోగములకు కారణములను కూడా తెలిసికొను చున్నాము.

దేహములోని యే భాగములో గజ్జిలేచి మందులతో అణచిపెట్టబడినా కనీనికలోని ప్రతినిధి భాగములో మచ్చలు కనుబడును. అట్లు అణచిపెట్టబడిన భాగములో అంతర్వ్రణము, క్షయ, (Sarcoma) పుట్ట వచ్చును. మా ఆసుపత్రిలో నయముచేసిన అంతర్వ్రణ కేసులన్నిటిలోను చికిత్సా కాలములో గజ్జిలేచినది. రెండు కేసులలో మాత్రము గజ్జి లేవలేదు గాని యీ రెండుకేసులలోను ఒంటినిండా దద్దురులు లేచినాయి. ఈ పదునెనిమిది సంవత్సరముల అనుభవములోను ప్రతి కేసులో కూడా చికిత్సా కాలములో గజ్జిలేచుటవలన ఒక్క సంగతి మాత్రము మనము మరువరాదు. వంశానుగతముగా వచ్చు రోగ ప్రవణతలననే అంతర్వ్రణములు పుట్టుచున్నవని హాన్‌మన్ చెప్పిన సిద్ధాంతములకు నేటికి నిదర్శనములు కనబడుచున్నవి. రెండువందల సంవత్సరముల క్రితమే హాన్‌మన్ యీ అభిప్రాయమును చెప్పినప్పటికినీ మందు వైద్యులు అపహాస్యము చేసినారు. ఆ సిద్ధాంతములోని సత్యమును యిప్పుడిప్పుడు తెలుసుకొనగల్గుచున్నాము. ప్రకృతి వైద్యముచేసి, గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధుల ద్వారా రోగప్రవణతను బయటకు పంపుటే మంచిదో, లేక రోగపదార్థమును అట్లనే నిలవఉంచుకొని తరువాత క్షయ, అంతర్వ్రణము మొదలగు దుష్కరరోగములతో యావజ్జీవితము బాధపడుట మంచిదో బుద్ధిమంతులగు మా చదువరులే గ్రహింతురుగాక.

మందు వైద్యము వారి లెఖ్ఖల ప్రకారము గత యేబది సంవత్సరములలోను మిగిలిన అన్నిరోగములవలన చావుల అంతర్వ్రణములతో యెక్కువమంది చచ్చారు. మిగిలిన రోగములతో చావులకన్న యీ వ్రణములతో 400 రెట్లు చచ్చారు. ఈ లెఖ్ఖలుకూడా వెనుకనుండీ మేము చెప్పుచూవచ్చిన సిద్ధాంతములనే బలపరచుచున్నవి. మందు వైద్యము వారు క్రొత్తమందుల కనుగొని తరుణరోగముల అణచిపెట్టుచున్న కొలదిని కాలికరోగములు యెక్కువగుచున్నవి. ఈ కాలికరోగములతో చావులెక్కువగుచున్నవి.

గజ్జి, చీడ, తీట మొదలగు చర్మవ్యాధులను అణచిపెట్టినందువలన కాలికరోగము యెట్లువచ్చినదీ ప్రకృతి చికిత్స అవలంబించినపుడు మరల గజ్జి యెట్లు ప్రత్యక్షమైనదీ తెలియచెప్పుటకు ఒక పెద్దమనిషి కథ చెప్పుతాను. మా ఆసుపత్రిలో ప్రత్యక్షముగా జరిగినదేగాని కల్పితము కాదు.

ఈ పెద్దమనిషిది చికాగో. చిన్నప్పటినుండీ జబ్బులతో తీసికొనుచున్నారు. అన్నిరకాల మందులూ సేవించారు. రోగమేమీ తగ్గలేదు. డాక్టర్లందరూ ఆశలు వదిలారు. కదలకుండా యింటివద్దనే ఉండమని సలహా చెప్పారు. తన రోగమునుగూర్చి తెలుసుకొందామని ప్రకృతి చికిత్సకుని వద్దకువచ్చినాడు. ప్రకృతి చికిత్స మనిషికినీ రోగికినీ ఈ క్రింది సంభాషణజరిగినది.

ప్ర-చి-నీవు చిన్నప్పుడు [illegible] గజ్జిలేచినదా.

రోగి-అవును.

ప్ర-చి-ఆ గజ్జని మందులతో నయముచేసినారు (అణచిపెట్టినారు.)

రోగి-అవును.

ప్ర-చి-ఆ మందులు చిన్న ప్రేగులలో నిలవ ఉన్నవి. అందువలన అజీర్ణముగా ఉండునది అప్పుడప్పుడు అజీర్తి విరేచనములు కలుగుచుండును. నీవు స్థిరగా అజీర్ణమును ప్రకృతిచికిత్సలో నయముచేసికొనక పోతే చిన్న ప్రేగులలో అంతర్వ్రణము పుట్టును.

రోగి-మీరు చెప్పినవన్నీ నిజమే. డాక్టర్లు యిన్నాళ్లు నారోగము జీర్ణాశయవ్యాధియని చెప్పుచున్నారు గాని నాకేమీ నమ్మకములేదు. నాకు రెండు తడవలు గజ్జిలేచినది. గంధకము పాదరసములతో తయారుచేసిన మందులతో అణచివేసినాము.

ఒక సంవత్సరము ప్రకృతి చికిత్సచేసినాము రోగము సగము నయమైనది. ఈ సంవత్సరములో రెండు మూడు పర్యాయములు స్వాస్థ్యసంకటములు కల్గినవి. గజ్జి లేవలేదు. కనీనికలోని మచ్చలు కొద్దిగా తగ్గినవి గాని పూర్తిగా లోపించలేదు. అంతవరకు హోమియోపతీ మందులను వాడలేదు. అప్పుడు హోమియోపతీ మందును యిచ్చినాము. ఇచ్చిన వారములో బాలుడు ఒంటినిండా గజ్జి లేచినది. విరోచనములు మొదలుపెట్టినాయి.

రెండువారాలపాటు ఉండిపోయినాయి. ఈ రెండు వారాలపాటున్నీ ఉపవాస మున్నాడు. జలచికిత్స మాత్రము చేసినాడు. తరువాత బాగా ఆరోగ్యముగా ఉన్నాడు.

ఆరునెలలు గడచిన తరువాత మరల హోమియోపతీ మందునే యిచ్చినాను. ఒంటెనిండా దద్దురులు లేచినవి. విరేచనములు మొదలుపెట్టినవి. ఇవి రెండువారాలపాటుండి అంతరించినాయి. ఈ మూడువారాలు ఉపవాసమున్నాడు. జలచికిత్స మాత్రము చేసినాడు. ఇప్పటికీ చిన్నప్రేగులలోని 'సోరా' మచ్చలు లోపించినాయి.

అయితే, హోమియోపతీ వైద్యులు అపహాస్యము చేయవచ్చు. "ప్రకృతి చికిత్సగూడ యెందులకు?" హోమియోపతీ మందులతోనే రోగము నయమగును గదా? అని అడుగవచ్చును. ప్రకృతి చికిత్సతో దేహమును శుద్ధి చేసిననే గాని హోమియోపతీమందు పనిచేయలేదు. దేహమంతా రోగపదార్థముతో నిండిపోయి ధాతుశక్తి తగ్గిపోయినపుడు హోమియోపతీ మందులేవియు పనిచేయలేవు. దేహము సున్నితమైనపుడే హోమియోపతీమందులు పనిచేయును. రోగపదార్థము బయటకు వెడలిపోవును. దేహములోని నిర్మాణశక్తికి వ్యతిరేకము కానంతవరకు అన్నివైద్యములలోని ఉత్తమచికిత్సల సమన్వయమే ప్రకృతి వైద్యము. దేహములోని నిర్మాణశక్తికి వ్యతిరేకముకాని మిగిలిన వైద్యప్రక్రియలతో నయముచేయుటయు ప్రకృతివైద్యములోనికే వచ్చును. మూలసూత్రములకు వ్యతిరేకముకాని వైద్యప్రక్రియలను ఉపయోగించకపోవుట, నాల్గు గుర్రములు అందికలోనుండగా, నాల్గు గుర్రములు కట్టవలసిన భగ్గీ బండికి మూడుగుర్రములు కట్టినట్లుండును.

గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులను మందులతో అణచిపెట్టినందువలననే కనీనికలో మచ్చలు కనపడును. మా అనుపత్రికి పరీక్షార్థమై వచ్చిన వారందరిలోను యీ మచ్చలు చూచుచుండెడివారము. గ్రంథవిస్తరభీతిచే వాని కథలను యిచ్చుట యెకరువు పెట్టలేదు

## ( సత్యమ్ )

## V

# నెకోపతీ

నమ్మకములేనిది యేమియును సాగదు. రోగము నయము కావలెనంటె, వైద్యునియందును వైద్యమందును, సంపూర్ణ నమ్మకము ఉండవలెను. నమ్మకము లేనిది రోగము మాత్రము కుదరదనే ఘట్టిగా చెప్పవచ్చును. రెండూరెండూ నాలుగనుట అసత్యమేమోగాని ఈమాట మాత్రము సత్యమే.

భార్యాభర్తల మధ్య నమ్మకముండాలి. భార్యను భర్తగాని, భర్తనుభార్యాగాని నమ్మాలి, పరస్పరముగా ఒకరినొకరు నమ్మలేకపోతే, సంసారశకటము సాగదు. అడుగడుగునకు అభ్యంతరము లేర్పడుచునే ఉంటాయి. భార్య పతివ్రతయైనా, వ్యభిచారి యనియో, బియ్యము అమ్ముకొంటుందని మగవాడు అనుమానపడుట మొదలుపెట్టితే, ఆ సంసారము ఎంతబాగావుంటుందో వేరే చెప్పనక్కరలేదు.

భర్త (లాకపోయిన) తాగుబోతనియో మొండలమూతా కోరనియో భార్య అనుమానపడుట మొదలుపెట్టిందా ఆ సంసారములో హాలాహలము పుట్టుతుంది.
తల్లి కొడుకులమధ్య ఈ నమ్మకము లేకపోతే, నిత్యము పోట్లాటలే సిద్ధమౌతాయి.

తల్లి (కాకపోయినా) అమాలగా బియ్యము అమ్ముతుందనో, యీ మూలముగా ! ఆడపిల్లలకు సొమ్ము కట్టిపెడుతుందనో, అనుమానపడడ మారంభిస్తే, పుట్టే కలకలలకు, అంతూపొంతూ లేదు. కొడుకు (పెట్టకపోయినా) కోడలు పుట్టింటివారికి సొమ్ము కట్టిపెడుతున్నాడని, తల్లి అనుమానపడినా పైతీరే సిద్ధమగుతుంది.

గురుశిష్యులమధ్య ఈనమ్మకముండాలి. గురువునందును, శాస్త్రమునందును, నమ్మకమే లేకపోతే, శిష్యుడికేమి చదువు అబ్బుతుంది. గురువునకేమియు తెలియదనియు, ఆ శాస్త్రమంతా అసత్యమనియు, తోస్తే చదువేమి సాగుతుంది, శిష్యుడికేమి ఉపయోగిస్తుంది.
శిష్యుడికేమియు రాదనీ,ఓట్టిమొద్దనీ, గురువు ప్రారంభిస్తే పాఠమేమీసాగదు. మూడుపూటలతోనే గ్రంధము పూర్తి అగుతుంది.

ఇంతవరకు పరస్పరనమ్మకమునుగూర్చి తెలుసుకొన్నాము ఇక ఆత్మనమ్మకమునుగూర్చి: తెలుసుకొందాము. దీనినే ఆత్మవిశ్వాసమనికూడా అనవచ్చును. ఇది లేకపోతే చాలాబాధలు వస్తాయి. ఇది లేనిదే దైనందినజీవితమే, జరుగదు. ఎప్పటికప్పుడు తెలుసుకొంటునే వుండును. అడుగడుగున శంకలు వచ్చుచునే వుండును. ప్రతిపని చేసి యెందుకు చేస్తినా యని, పస్తాయించుచునే ఉండును. ఈరకమువారి మనస్సులోపుట్టే తలంపులకు ఆలోచనలకు, అంతూపొంతూ ఉండదు. లోపాలను యెంచుటయే, ప్రధానముగా పెట్టుకొంటారు, గాని వస్తువులోని గుణమును మాత్రము గ్రహించలేరు.

దీనినే ఆత్మవిశ్వాసమని కూడా అన్నాము. ఏ విషయమైనా తమకు తెలిసినంతవరకు తీవ్రముగా విచారించి నిర్ణయమునకు రాగలనని నమ్మకముండాలి. తానా విషయమై విచారించలేకపోతే ఫలానా మనిషి ఆలోచించి సరియైన నిర్ణయమును చెప్పగలడను నమ్మకముండాలి. తాను విచారించనూలేక, పొరుగువారియందు నమ్మకమూలేకపోతే, ఆ వ్యాపారమే సాగదు. ఆత్మనమ్మకము చాలా గొప్పది. కాబట్టి ఆత్మబుద్ధి సుఖించెనా అన్నారు పెద్దలు.

మా వైద్యసోదరులకుముఖ్యముగా చెప్పేదేమంటే. తల్లి అయినాసరే,రోగైనా సరే,పెళ్ళాన్నైనా సరే,కడుపున పుట్టినబిడ్డఅయినాసరే.మీయందును మీవైద్యశాస్త్రమునందును నమ్మకములేనిదే, మనుష్యుల నమ్మించే పోయి, వైద్యప్రక్రియలను మొదలు పెట్టకండి. మట్టాలి చూపుగా పోయిరండి.

ఈ నమ్మకముండుటచేతనూ, ఆయన కనుపాలనముగా చేయుటచేతనూ అందరు ఆశలు వదులుకొని బయటపారవేసినా బ్రతికిన ప్రత్యక్షముగా జరిగిన ఒకరోగి కథను చెపుతాను, 1933 సంవత్సరము మార్చిలో జరిగిందీ కథ.

వీరిది గుంటూరుజిల్లా తెనాలితాలూకా. 28 సంవత్సరముల వయసు వుంటుంది. పేరు: బు. న. తెనాలిపోయి వస్తూవుండగా తోవలో పడిపోయినాడు. దారిని పోయేవాళ్ళు యింటికి వచ్చి చెప్పగా, తండ్రిపోయి యెట్లాగైతేనేం కొడుకును యింటికి చేర్చాడు. వచ్చిన తరువాత వాళ్ళు, వీళ్ళు, పోగైనారు. తలొకవిధముగా తలపోశారు, చేతబడి అనుకున్నారు. పాము తొక్కాడు అన్నారు. తొలుదొలకి తోచినట్లల్లా వాళ్ళు చెప్పారు.

ఈ రోగికి మొదటినుంచీ ప్రకృతివైద్యములో అభిమానముంది. రాగానే ఈ వైద్యప్రక్రియలన్నీ చేశారు. ఆ కమ్ముకము కాస్త తగ్గినప్పటికీ మళ్ళీ వస్తూనే వున్నది. స్పృహలేకుండా పోయింది.

రెండురోజులు గడిచినాయి. చుట్టాలలోని గాభరా యెక్కువై పోయింది. బావమరదులకు మందువైద్యములో నమ్మకమున్నది. తెనాలి తీసుకపోయి ఘాటైన మందులు పోయిద్దామన్నారు. ఇంతలోకి కాస్త తెలివి వచ్చింది. అయినా రోగిని కనుక్కొని చేయుట మంచిదిగదా, అని రోగిని అడిగినారు.

బా. మ- ఏం ఎట్లావున్నది.
రోగి- (నోరు బిగుసుకుపోయింది)
బావ- బా థెక్కడ
రో- (సంజ్ఞ) ఒళ్ళంతా.
బా- ఏం చెయ్యమంటావు?
రో- (సంజ్ఞ) ఏమిటి?
బావ- మందు మా టేమిటి?
రో- (సంజ్ఞ) ఎందుకు?
బా-జబ్బు చేస్తే.
రో-(హీనస్వరముతో) ...తో...ట్టి...స్నా...నం.
బా-చేస్తున్నాము. గుణమేమిలేదాయె
రో-(హీనస్వరముతో) అయితే.
బా-తెనాలి తీసుకపోయి మందిప్పిద్దామని.
రో-(హీనస్వరముతో) నాకేనా?
బా-అవును.
రో-(సంజ్ఞ) చచ్చినాసరే తినను.
బా-ఏమిటీపంతం.
రో-(సంజ్ఞ) అంతే!
బా-సరేలే నీయిష్టం.

తెల్లవారింది మళ్ళీకమ్ముకు వచ్చింది. మాటపోయింది. ఒళ్ళంతా చలువలు కమ్మింది. తూర్పువేపు బయట వసారాలో భూశయనము చేశారు. అందరు, ఆశలు వదలుకున్నారు. కట్టెకూడా కనపడదేమోనని దూరపు చుట్టాలకు కబుర్లు పోయినాయి. 'యావజ్జీవమ్ తావచికిత్స' గదాయని, యింతకు రోగికి నమ్మకమున్నదిగదా యని ప్రకృతివైద్యులు చికిత్స చేశారు.

సూర్యకిరణములను ఎర్రఅద్దములగుండా అరగంట ప్రసరింప చేశారు. ప్రతిరెండుగంటలకు అరగంట చొప్పున రెండుపర్యాయములు ప్రసరింపచేశారు. వేడి తగిలింది. ఆ వేడి నిలబడిపోయింది. స్పృహవచ్చింది. మళ్ళీకమ్ముకురాలేదు, కృష్ణచంద్రుడుమూడిరి రోగము తగ్గింది. ఆరోగ్యము చేకూరింది. ముగ్గురుబిడ్డల తండ్రి అయ్యాడు.

# పొంగు, ఆటలమ్మ, మసూచకము మొదలగు అంటువ్యాధులు

డా॥ పువ్వాడ పేరాజుగారు

పై నుదహరింపబడిన అంటువ్యాధులన్నియు జ్వరముతోనే ప్రారంభమగును. జ్వరము నివారింపదగిన వ్యాధి గాదనియు, అజీర్ణరోగపదార్థము శరీరమునందు గలదనియు, మండమును పొంది తరుణరూపమును దాల్చినట్లు తెలుపు వేగులవానివంటిదనియు యింతవరకు తెలిపియుంటిని. జ్వరము కనబడినతోడనే యది యే కారణమున వచ్చినదో తెలియదు.' చుట్టుపట్ల పొంగుట మొ॥ని యున్నందున అట్టివ్యాధి రావచ్చునని యూహించెదరుగాని వైద్యులకును ఆసంగతి తెలియదు. కుహినీ మహాశయుని ముఖవైఖరీ శాస్త్రమువలన మాత్రము జ్వరము రాకముందే శరీర మన్యపదార్థముచే నిండియున్నదనియు అది పైవ్యాధులమూలమున బహిష్కరింపబడగలదనియు ముందే తెలియగలదు. జ్వరము వచ్చిన కొద్దిరోజులవరకు రోగికి కుదురులేకపోవుట, తలనొప్పి, ఒళ్ళునొప్పులు, నిద్రలేమి, వాం॥ వెక్కు వికారములుండును. మనరాజ్యమందు చాలభాగము యీవ్యాధులకు అమ్మవారు కారణమనియు, మందులు వాడరాదనియు, యే చికిత్సయు చేయకూడదనియు అంక్షణములు సైతముండరాదనియు పిచ్చి నమ్మకము కలదు. మందులు వాడకపోవుట మంచిదేగాని, రోగి కక్కరలేకున్నను అహారమిచ్చుట పొరబాటు. ఇక్కడ అంటువ్యాధులగూర్చి కొంత చెప్పవలసియున్నది. అల్లోపతి వైద్యు లూహించినట్లు జీవి సిద్ధాంతమునుబట్టి ప్రతివానికిని మసూచికపు సూక్ష్మజీవులు వ్యాపించి

మసూచికము తెచ్చునను కొనుట పొరబాటు. సూక్ష్మ జీవులవలన శరీరమందు రోగపదార్థము పుట్టదు. గాని రోగపదార్థమున్న శరీరమందు సూక్ష్మజీవులు ప్రవేశించినయెడల వృద్ధిపొందును. రోగపదార్థములేని శరీరమందవి చచ్చును. ఎట్లన కాలుచున్న చుట్ట చెత్తమీద పడిన, చెత్త అంటుకొనును. శుభ్రమైనచోటపడిన ఆరిపోవును గదా! అట్లే అన్యపదార్థము లేని శరీరమునందా సూక్ష్మజీవులు పనిచేయవు సరిగదా అవియే నశించును. కావుననే ఒకే కుటుంబములోని పిల్లలందరకును మసూచకము రాదు. కొందరు దిగడుటగలదు. పేద కుటుంబములలో నొక చిట్టిగుడిశయందు 4, 5 గురు పిల్లలున్నప్పుడు స్థలాభావముచే రోగితోగలసి ఒక్క మంచమునందే అందరు పరుండినను ఒకరిద్దరకు మసూచికము రాకపోవుట మనము చూచుచున్నాము. ఇవి అంటువ్యాధులగుట నిజమే. ఐనను ఇవిగాలి యొక్క శీతోష్ణమార్పులవలననే వృద్ధిపొందును. శీతకాలాంతమున అంతవరకు చలిగానుండు గాలి వెచ్చబడును. ఉష్ణమువలన శరీరములందలి రోగపదార్థమునందు మండమేర్పడును. కారణమేమన ఉష్ణమువలన శరీరములందు చైతన్యము వృద్ధియై అవయవములకు చురుకుగలిగి శరీరమందలి యన్యపదార్థమును నెట్టివేయుటకు ప్రయత్నించును. ఈ మండమే శరీరమందు వ్యాపించుటలో అడ్డుతగులుటచే ఒరపిడిగలిగి వేడిపుట్టును. ఈవేడియే జ్వరము. ఒక్కొకకుటుంబమునందు గాని ఒక్కొక ప్రాంతమునందుగాని వ్యాపించుటకు హేతువేమన కారంపరను ఒకేవిధమగు ఆచార, ఆహారవిహారములు గలిగియుండుటయు, ఒకేస్థలమందుండుటయే! వీరందరకును శరీరమందు కొద్దియో గొప్పయో అన్యపదార్థములు గలిగియుండుటచే గాలి మార్పును పొందిన వెంటనే వారి శరీరములందలి అన్యపదార్థము పొంగి మండమేర్పడును. అందుచే నీ అంటువ్యాధులకు గురియగుచున్నారు. ఇందుకు శీతోష్ణమార్పులు కారణము. దయామయుడగు పరాత్పరుడు మనయారోగ్యమును కాపాడుట కిట్టి మార్పు ప్రసాదించెనేగాని మనలను నశింప జేయుటకు కాదు. ఈతరగతి వ్యాధులవలన అన్యపదార్థ విమోచనము గలిగి పునరారోగ్యము గలుగుట నిజమే యైనను వానివలనగలుగు బాధలు ఎక్కువగ నుండుటయు, దుర్బల శరీరులు వీని తాకుడుకాగలేక మృతిబొందుటయు జరుగుచుండుటచే భయపడవలసివచ్చుచున్నది. దానికి ప్రతీకారము చేయుటకు గాను అల్లోపతి శాస్త్రజ్ఞులు ఈమసూచిక విషమును ముందే శరీరములోనికి ఇంజక్టుచేసి యీ యన్యపదార్థమును పొంగకుండ అణచుటకు ప్రయత్నించుచు శరీరమును దుర్బలవంతముగ జేయుచున్నారు. గాని ఈపరిస్థితి చిరకాలముండదు. శరీరమునం దేమాత్రము శక్తియుండినను యీయన్యపదార్థమును గెంటివేయ ప్రయత్నించునే గాని అది శరీరమునందుండుట కిష్టపడదు. అట్టి తరుణమున గాలిమార్పుచే నీవ్యాధి యొక్కచో ప్రారంభము కాగానే సమానస్థితిగలవారలు ప్రాంతములందు వ్యాపించక మానదు. అన్యపదార్థమును టీకాల విషము యెంత నొక్కిపట్టినను అది పూర్తిగ నణగక మిగిలినదానియందు మండమేర్పడును. వ్యాధి గలుగును. టీకాలు వేసినవారికి యీ వ్యాధివచ్చినను పూర్తిగా అన్యపదార్థ విమోచనము జరుగక కొంత మిగిలియుండునుగాన మసూచికము పడినను పడకున్నను కాలిక వ్యాధులకు గురియగుదురు. టీకాలు వేయనివారు యీ వ్యాధిచే అన్యపదార్థవిమోచనము జరుగుటచే ద్విగుణీకృత శక్తిచే కోలుకొని పూర్ణారోగ్యవంతులగుదురు. టీకాలవలన మసూచికము అరికట్టబడకపోయినను ప్రాణభయము రాదందురు. అది నిజమైనయెడల అన్యపదార్థ విమోచన గలుగకుండుటయు కాలికవ్యాధులకు లోనగుటయు జరునుగదా! టీకాలు వేయుటవలన మనదేశమందు మసూచికవ్యాధి తగ్గలేదు సరిగదా కాలనిర్ణయము లేక సంవత్సరము పొడుగునను యీ వ్యాధులు కను బడుచునే యున్నవి. అందువలన వీని నాపుటకు ఇప్పుడుపయోగించు విషముకంటె హెచ్చు శక్తిగల విషము నుపయోగించవలెనని యుండుట స్పష్టమగుచున్నది. ఇప్పటికే మనదేశము యీ వాక్సినేషను మున్నగు ఇంజక్షనుల మూలమున క్షయ, కుష్ఠు, మున్నగు కాలిక వ్యాధులకు గురియైనది గదా! ఇక వ్యాక్సినేషను చేయకున్న నీవ్యాధు లెక్కువై ప్రజలు మరణించెదరనుటయేల? వ్యాక్సినేషను మరణము నాపలేదు సరిగదా రోగములనైనను ఆపినదా! బ్రతికినవారిలో నెందరు కురూపులగుచున్నారు! వ్యాక్సినేషను చేసినది మొదలెందరు పసిబిడ్డలు రోగపీడితులై తుదకు చనిపోవుచున్నారు! వ్యాక్సినేషను చేయుటకైనను వైద్యశాస్త్రవేత్తల నియమింపక పోవుటచే దుర్బలురై అనారోగ్యవంతులైన పిల్లలకుగూడ తల్లిదండ్రుల మొరల వినక వారికిగల చట్టాధికారములను నుపయోగించి బలవంతముగ టీకాలు వేయుటయే దీనికి కారణము.

